

# విజ్ఞానభక్తితరఙ్గిణి.

ప్రజ్ఞానానంద

ప్రణీతము.



ప్రకాశకులు:

చాగంటి సూర్యనారాయణమూర్తి,

రాజమహేంద్రవరము.

౧౯౩౬.

 [వెల రు. ౦—౮—౦

ఈ ప్రతులులభించుస్థానము :—

చాగంటి సూర్యనారాయణమూ

తాడినాడవారివీధి,

ఇన్నీసుపేట,

రాజమహేంద్రవరము.

రాజమహేంద్రవరము :

శ్రీసత్యానందప్రెస్‌నందు,

ముద్రింపఁబడినది.

# ఉపోద్ఘాతము.

శ్రీపరమేశ్వరలీలాకల్పితంబై భిన్నాభిన్నరూప మగు నేతజ్జగంబందలిభూతజాలంబున మానవజాతి జ్ఞానప్రధానంబగుటచే నుత్తమంబని చెప్పనొప్పియున్నది. అయినను, మానవులు తమజ్ఞానం బజ్ఞానమిళితంబగుటంజేసి నిజస్వరూపం బెఱుంగక సంసారసంకటంబులపాలగుచున్నారు. ప్రాణికోటు లఖండసుఖస్వరూపంబునుండివచ్చినవారగుటచే జలంబు వెలువడినమీనంబు మరలజలంబుఁ జేరినంగాని సుఖంబు నందఁజాలనిచాడ్పున సుఖాభాసంబుల ననుభవించుచు, నున్నతోన్నతసుఖంబులాకాంక్షించుచుండిరేగాని యథార్థపరమసుఖంబు నందఁజాలకున్నారు. అట్టియఖండసుఖంబునందుటకు శ్రుతిగీతాదులు, ఆచార్యపురుషులసిద్ధాంతములు, తద్విధిప్రయుక్తసదాచారజపతపోనియమాదులు, ముక్తులచరిత్రములు, మహాత్మానుష్ఠితపద్ధతులును, మార్గదర్శకములై యున్నవి. ఆమార్గంబులలోఁ బూర్వాంగ మగుసత్కర్మాచరణముచే శుద్ధచిత్తుఁ డగు ముముక్షువునకు భక్తి యొక ప్రధానమోక్షమార్గంబని శ్రుతిస్మృతులేగాక యాచార్యప్రభృతులును వక్కాణించి పలుతెఱుంగుల గ్రంథములలో వివరించియున్నారు. ఆలోకపూజ్య

గ్రంథములు పండితేతరులకు దుర్గ్రాహ్యంబులై యున్నవి. అర్థవేత్తలకుఁ గొందఱకుంగూడ దుష్కృతవశంబునంజేసి చిత్తం బన్యాయత్తంబై యాత్రోవం జనకుండుటచే సుగమంబయ్యుఁ దన్మార్గంబు దుర్గ్రాహ్యంబేయని చెప్పఁదగియున్నది. సుకృతులను, శుద్ధచిత్తులను, ఇంతయేల, యాంధ్రదేశవాసులను, విపరీతభావనాదిచిత్తసందేహరహితులం జేసి, నిత్యానందమోక్షపదంబు నందజేయనెంచి, బ్రహ్మస్వరూపు లగు శ్రీశ్రీశ్రీ ప్రజ్ఞానానందస్వాములవారు లోకులదుర్గమమార్గంబునఁ జొరఁబెట్టక స్వానుభవమునే వెల్లడించుచు విస్పష్టశైలితో నీ 'విజ్ఞానభక్తితరఙ్గిణి' యనువచనగ్రంథమూలమున సర్వవేదాంతసిద్ధాంతసంగ్రహమును విశదీకరించిరి. ఏతద్గ్రంథప్రాశస్త్యంబు నాస్వల్పబుద్ధిచే వివరింపనెంచుట దీపముచే సూర్యునిజూపుటయే గాన దీనియోగ్యతను పరమభాగవతు లగుచదువరులే గ్రహింతురుగాత. శ్రీశ్రీశ్రీ స్వాములవారు శ్రీశుకులం బోలె పిన్నవయసుననే వైరాగ్యంబుజనింప 'బ్రహ్మచర్యంబుననే సర్వసంగపరిత్యాగంబొనర్చి సద్గురునను గ్రహముచేఁ హిమాలయంబునఁ దపంబొచరించి తత్త్వరహస్యంబు ననుభవపూర్వకంబుగానెఱింగి, లోకులను సద్బోధాదర్శములచే భవబంధవిముక్తులను జేయుచున్నారు. శ్రీ వీరు పూర్ణవిరాగులనుట కహంతామమతాశూన్యతయు, నిరభిమానులనుటకుఁ నిరాడంబరకరపాత్రభిక్షయు, తత్త్వజ్ఞులనుటకు నిరంతరధ్యానసమాధినిష్ఠయు సాక్ష్యమైయుండ, నిత్యానందము, భేదరాహి

త్త్వము, హృష్యన్ముఖవికాసము, సర్వసమత్వము, సర్వజనాను
కూలతయుఁ గలవారై, యొక్కయెడ ధ్యాననిష్ఠులై యుండ
జనులయదృష్టవశంబునంగాఁబోలు మనంబున స్ఫురించినవారి
స్వానుభవస్థితియు, నాత్మసామ్రాజ్యప్రాప్తిమార్గమును వెల్ల
డింప నిచ్ఛవొడమి కాలానుగుణమృదుమధురశైలితో నీ
'విజ్ఞానభక్తితరఙ్గిణి' గ్రంథమును రచించి మనకనుగ్రహిం
చిరి. కావున భక్తులెల్లరును లోకోపమానవిరాజితమై, సలక్ష్య
లక్షణం బగునేతద్గ్రంథసారామృతరసం బాస్వాదించి యాత్మ
సామ్రాజ్యం బనుభవింతురుగాత. శాశ్వతస్వరూపు లగు
శ్రీవారిగ్రంథము శాశ్వతమై భక్తులఁ గృతార్థులం జేయుఁ
గాత. శ్రీ శ్రీ శ్రీ!

ఓం తత్సత్ !

శతావధాని,

ములుకట్ల వెంకటకృష్ణశాస్త్రి.



# విషయానుక్రమణిక.









# స్తోత్రతరఙ్గః

## ౧. పరబ్రహ్మోపాసనా.

శ్లో॥ ఏకమేవాద్వితీయంచ స్వయంజ్యోతిఃపరాత్పరమ్ ।
నిర్గుణం నిర్మలం శాంతం నిరావరణశోభితమ్ ।
అఖండం సచ్చిదానందం మనోవాచామగోచరమ్ ।
అప్రమేయ మనాద్యంతం బ్రహ్మతత్సముపాస్మహే॥ ౧

సర్వాధారం సర్వసాక్షిస్వరూపమ్ ।
సర్వానందం సర్వవిజ్ఞానకందమ్ ।
సర్వాఽభావం సర్వసత్త్వస్వభావమ్ ।
సర్వాత్మానం బ్రహ్మచైతన్య మీడే॥ ౨

యస్యానందరసానుభూతి రచలా తాపార్తినిర్వాపిణీ ।
యత్సాక్షాత్కరణా ద్విభాతి న పునర్మాయా జగన్మోహినీ।
ధ్యేనైకత్వసుబోధవృత్తి రమాలా నిర్వాణసంధాయినీ।
తస్మిన్బ్రహ్మణిచిత్తవృత్తి రనిశంపూర్ణాత్మని స్థీయతామ్॥ 3

ఓం తత్ సత్ !





## ౨. బ్రహ్మైక్యానుసంధానాష్టకమ్.



శ్లో॥ విశుద్ధం పరం నిత్యనిర్వాణరూపమ్ ।
నిరాకార మోంకారగమ్యం తురీయమ్ ।
ప్రశాన్తం ప్రపూతం ప్రకృష్టం ప్రపూర్ణమ్
పరబ్రహ్మసత్యం తదేవాహమస్మి ॥

అశేషం ధ్రువం సచ్చిదానందరూపమ్ ।
స్వయంజ్యోతిరాకార మేకం వరేణ్యమ్ ।
విసంగం విపాపం విచింత్యం విబోధ్యమ్ ।
పరబ్రహ్మసత్యం తదేవాహమస్మి ॥

అనన్తం తతం సర్వధీసాక్షిభూతమ్ ।
చిదానందకందం నిజానందసాంద్రమ్ ।
స్వయం నిర్వికల్పం నిరస్తప్రపంచమ్ ।
పరబ్రహ్మసత్యం తదేవాహమస్మి ॥

అభేదం శివం భానుకోటిప్రదీప్తమ్ ।
సమాధ్యైకవేద్యం సదా మౌనిసేవ్యమ్
మనోవాగతీతం విమాయం విశోకమ్ ।
పరబ్రహ్మసత్యం తదేవాహమస్మి ॥

అదృశ్యం స్థిరం కేవలం కాలకాలమ్ ।
శ్రుతే ర్నేతి నేత్యుక్తిభిర్భావ్యతత్త్వమ్
గుణాన్తం పురాన్తం భవాన్తం భ్రమాన్తమ్ ।
పరబ్రహ్మసత్యం తదేవాహమస్మి ॥ ౫

ప్రసిద్ధాత్మరూపం ప్రమాణాదిహీనమ్ ।
నిరాభాసనిర్దోషనిర్ద్వంద్వరూపమ్ ।
అనిర్దేశ్య మవ్యక్త మాద్యంతశూన్యమ్ ।
పరబ్రహ్మసత్యం తదేవాహమస్మి ॥ ౬.

న కర్తా న కార్యం న భోక్తా న భోగ్యమ్ ।
న పుణ్యం న పాపం న నాకం న మర్త్యమ్ ।
నిరాలంబనిర్లేపనాదాంతతత్త్వమ్ ।
పరబ్రహ్మసత్యం తదేవాహమస్మి ॥ ౭

న వర్ణో న వర్ణాశ్రమాచారధర్మాః ।
న చాహం న చాయం నిరస్తప్రభిన్నమ్ ।
అవస్థాత్రయాతీత మద్వైతతత్త్వమ్ ।
పరబ్రహ్మసత్యం తదేవాహమస్మి ॥ ౮

ఓం తత్ సత్ !

## ౩. బ్రహ్మానందానుభూతిః.

శ్లో॥ ఓంనమస్సచ్చిదానంద పరబ్రహ్మైకరూపిణే ।
సర్వశ్రుతిశిరోవాక్య మహాభావార్థమూర్తయే ॥ ౧

బ్రహ్మ పూర్ణం సదాపూర్ణ మనన్త మచలం ధ్రువమ్ ।
అంతఃపూర్ణం బహిఃపూర్ణ మనాది మజ మవ్యయమ్॥ ౨

అంతశ్శూన్యం బహిశ్శూన్యం సర్వశూన్య మలక్ష్యగమ్।
అంతస్సత్యం బహిస్సత్యం సర్వత స్సత్యమేవ హి ॥ ౩

నిత్యం శుద్ధం పరం బుద్ధ మేక మద్వయ మక్షరమ్ ।
శాశ్వతం సకలం శాన్తం సర్వగం సర్వతోముఖమ్ ॥ ౪

నిర్వికల్పం నిర్వికారం నిరాకారం నిరంజనమ్ ।
నిర్విశేషం నిరాభాసం నిరీహంచ నిరామయమ్ ॥ ౫

నిష్కలం నిష్క్రియం ముక్తం షడూర్మిరహితం శివమ్ ।
నిరవద్యం నిరాలంబం నిర్గుణం విమలం శుభమ్ ॥ ౬

అపార మతులం భవ్య మఖండం చిన్మయాత్మకమ్।
అసంగ మచ్యుతం గుహ్య మవాఙ్మానసగోచరమ్ ॥ ౭

మాయాతీతం భవాతీతం భావాతీత మతీంద్రియమ్ ।
ఆనందం సర్వతస్సారం సర్వాధారం సనాతనమ్ ॥

చైతన్యం జ్యోతిషాంజ్యోతిః ప్రకృష్టమమృతం ప్రియమ్।
సన్మయం కేవలం దివ్యం ప్రజ్ఞానం పరమోత్తమమ్ ॥ ౯

ప్రశాన్తం పరమాఽద్వైతం పరాఽపరవివర్జితమ్।
సర్వంహిఖల్విదం బ్రహ్మ నాస్తి నాస్తియతః పరమ్॥ ౧౦

ధ్యాయంతి యే బుధా స్తోత్ర మిదం నిశ్చలబుద్ధయః।
తే ప్రాప్నువంతి బ్రహ్మైక్యం తరంతి భవసాగరమ్॥ ౧౧

ఓం తత్ సత్ !

## ౮. శ్రీసద్గురునమోవాకమ్.



శ్లో॥ అజ్ఞానదుస్తరాబ్ధే ర్మాం యత్కృపా తారయిష్యతి।
నిష్క్రియాయ ప్రశాన్తాయ తస్మై శ్రీగురవే నమః॥ ౧

సేవా యత్పాదపద్మస్య మహాకిల్బిషనాశినీ।
తం దేవ మచలం వందే జ్ఞానానందం తపోనిధిమ్ ॥ ౨

యస్య ప్రసాదమాత్రేణ సంప్రాప్తం జ్ఞాన ముత్తమమ్।
తం దేవం కరుణాసింధుం విశ్వపూజ్యం భజామ్యహమ్ ॥ 3

యస్య వాగమృతం పీత్వా ముముక్షు ర్విందతే పరమ్ ।
బోధస్వరూపిణం దేవం ప్రణమామి గురూత్తమమ్ ॥ ౪

యో భక్తవత్సలో దేవః సదా మాం పరిరక్షతి ।
నమామి సద్గురుం తం హి శంకరం లోకపావనమ్ ॥ ౫

ఓం తత్ సత్ !

## ౧. శ్రీ జ్ఞానానందోపాసనమ్.



శ్లో॥ పూర్ణసూత్రప్రదం దేవం పూర్ణవిజ్ఞానవిగ్రహమ్ ।
ఆధారం సర్వభక్తానాం జ్ఞానానంద ముపాస్మహే ॥ ౧

పూర్ణానందప్రదం దేవం పరమానందవిగ్రహమ్ ।
పూర్ణరూపధరం దేవం జ్ఞానానంద ముపాస్మహే ॥ ౨

సర్వాభీష్టప్రదం దేవం సర్వమంగళవిగ్రహమ్ ।
సర్వకారుణ్యపాథోధిం జ్ఞానానంద ముపాస్మహే ॥ 3

స్వప్రకాశమయం దేవం విశ్వభాసకరూపిణమ్ ।
తారకం సర్వభూతానాం జ్ఞానానంద ముపాస్మహే ॥ ౪

సత్స్వరూపమయం దేవం పరమాత్మాన మద్వయమ్ ।
సర్వాధ్యక్షం నిజం దేవం జ్ఞానానంద ముపాస్మహే ॥ ౫

ఓం తత్ సత్ !

## ౬. శ్రీసద్గురుధ్యానమ్.



శ్లో. నిత్యానందం నిగమవిదితం నిర్మలాఖండమూర్తిమ్ ।
విశ్వాత్మానం విమలవపుషం విశ్వభద్రావతారమ్ ।
పూర్ణాకారం పరమపురుషం ప్రత్యగాత్మైకరూపమ్ ।
సర్వాధారం సకలశివదం సద్గురుం తం నమామి ॥ ౧

గగనసదృశరూపం సర్వధర్మైకరూపమ్ ।
విమల మచల మేకం సచ్చిదానందరూపమ్ ।
సకలనిగమసారం సర్వవిఘ్నాపహారమ్ ।
పరమసుఖదమూర్తిం స్వాత్మనాథం భజామి ॥ ౨

సత్యం పరం నిత్య మఖండ మద్వయమ్ ।
ఆధార మానంద మచింత్య మవ్యయమ్ ।

సర్వస్య లోకస్య నిదాన మేకదమ్ ।
ఆత్మాధినాథం సతతం నతో స్మ్యహమ్ ॥ 3

అఖండనిర్వాణసుఖైకరూపమ్ ।
విశుద్ధవిజ్ఞానఘనైకరూపమ్ ।
అశేష హేతుం పరమార్థభూతమ్ ।
తదైక్యవేద్యం గురుచంద్ర మీడే ॥ ४

వాచామగోచర మనన్త మగణ్యరూపమ్ ।
దేవాధిదేవనుతకోటిదివాకరాభమ్ ।
మాయావిలాసపరిగర్భితపూర్ణతత్త్వమ్ ।
జ్ఞానైకగోచరతనుం గురురాజ మీడే ॥ ५

ఓం తత్ సత్ !

పరబ్రహ్మార్పణమస్తు.





నమో భగవతే జ్ఞానానందాయ !

# విజ్ఞానభక్తితరఙ్గిణి



## ప్రథమతరఙ్గము.



ధర్మసంబద్ధమైనట్టియు, సదాచారానుగుణమైనట్టియు, “సత్యం వద, ధర్మం చర, మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ, అతిథిదేవో భవ”, ఇత్యాది విధ్యుక్తసత్కర్మానుష్ఠానములచే, క్రమకాలమున దేహమనంబులు మాలిన్యరహితములై పారిశుధ్యదశ నొందును.

౨. ఈరూపమైన దేహమనంబుల పారిశుధ్యావస్థయే చిత్తశుద్ధి యనంబడును.

3. సహజప్రేమస్వభావముగల నిర్మలవిశుద్ధాంతరంగులకు, భవబంధవిముక్తిపూర్వకపరమపదప్రాప్తికి భక్తి, తరణోపాయమై తనరుచున్నది.

౪. చిత్తశుద్ధిలేనిభక్తి పెంపొందఁజాలదు. అదెట్లనః జలముచేఁ దడిసినవత్తికిఁ దైలమును జేర్చి వెలిగించినను వెలుగనిచందమున, దేహమనంబులు అధర్మకరమైనట్టియు, సదాచారవ్యతిరిక్తమైనట్టియు, కర్మలతోడను, భావములతోడను బూరితమై, కలుషితమై యున్నతఱి, భక్తి జలగూర్చినను, నది పెంపొందక, యంతరంగమున హరిధ్యాన మనియెడిజ్యోతి వెలుఁగొందదు. జలసిక్తముగానివత్తికిఁ దైలమును జేర్చి వెలిగించినంతనే ప్రజ్వలించునట్లు, మలినరహితమైన విశుద్ధచిత్తమందు, భక్తిసోపయుక్తమై, పెంపొంది, పరంజ్యోతిఃస్వరూపునిదివ్యతేజమును దేదీప్యమానముగఁ బ్రదర్శింపఁజేయును.

౫. తరంగాదులకు జలమువలెను, ఘటాదులకు మృత్తువలెను, ఆభరణాదులకు స్వర్ణమువలెను, దృశ్యాఽదృశ్య మగు నీయనంతవిచిత్రలీలాబ్రహ్మాండమునకు సర్వాధారమై, సర్వమయమై, సర్వమునై, కర్తయై, భర్తయై, లయమూర్తియై, శక్తిజ్ఞానానందప్రదాతయై వేలుఁగొందునేకాఽద్వితీయాఽనంతసచ్చిదానందదివ్యపరిపూర్ణపరబ్రహ్మమునెడఁ గల, యహేతుకసహజాపారానవచ్ఛిన్ననిశ్చలనిష్కలసుదృఢమృదుమధురానన్యపరమప్రేమస్వరూపమునే భక్తియనిపేర్కొందురు.

౬. ప్రేమ యన ననురాగము.

౭. ఏకాకార, సర్వమయ, సమరసపరమాత్మనుండి ప్రాదుర్భావము నొందినకారణమున, సామరస్యానురాగరూపమగుప్రేమ, జీవకోటియం దెల్లెడను సహజము.

౮. నీరు పల్లమునకుఁ బ్రవహించునట్లీజీవకోటియందు వర్తించుసహజప్రేమ యధోగమనమును జెంది, యనృత, జడ, దుఃఖాత్మికము లగు దేహేంద్రియవిషయసంఘాతములందు బద్ధమై యుండునంతవరకు, కర్మబంధమై, జీవుని తాపత్రయాత్మికానిత్యఘోరసంసారవశవర్తిని జేయును.

౯. భగవద్భిన్న మగుపదార్థముగాని, కర్మగాని, భావముగాని లేమింజేసి, సంసృతిబంధానుభవముగూడ నిరర్థకము గాక, క్రమానుభవముచే విషయవైముఖ్యమును జనింపఁజేసి, సర్వమాతృకమును, పరమార్థస్వరూపమును నగుసచ్చిదానందపూర్ణబ్రహ్మమం దత్యంతదృఢతరానురాగమును బ్రభవింపఁజేయును.

౧౦. నదీనదము లెంతవక్రగమనము సల్పినను, వాని వృత్తి సర్వదా మాతృస్థాన మగుజలధియందు సంగమించుటయే యగునట్లు, సర్వజీవులందు వర్తించునీసహజప్రేమ, నిరంతరకార్యరూపమునఁ బ్రవహించి మాతృస్థానమును, సర్వాశ్రయమును నగునారాయణునియందు సంగమించి తదైక్యమును జెందుటయే స్వభావముగాఁగలది.

౧౧. ఎన్నఁడీసహజప్రేమ, యనిత్యదేహేంద్రియవిషయవిరాగమునుజెంది పరాత్పరునం దైక్యమొందుటకై యనవరత, తీవ్రాఖండప్రవాహరూపమును దాల్చి యూర్ధ్వగతి నొందునో, యంతటనే భక్తి యనఁబడును.

౧౨. భక్తి యన నవిభక్తస్థితి.

౧౩. సర్వాశ్రయుఁ డగునారాయణునికంటె భిన్నము గాక సదా తదైక్యమున నవిభక్తస్థితియందు రాజిల్లుటయే భక్తి.

౧౪. మిథ్యావిషయవైముఖ్యమును మొదలుగాఁగలిగి పరాత్పరునియందు సంగమించువరకును గల క్రియారూపప్రేమప్రవాహమునకు గౌణభక్తి యనియు, సాధనభక్తి యనియును, సంగమించి తదైక్యమున నవిభక్త్యభేదసామరస్యమును జెందినప్రేమరూపమునకు సాధ్యభక్తి లేక పరాభక్తి యనియును పేరు. అనగా విషయవైముఖ్యమాదిగా గలిగి పరబ్రహ్మైక్యావిభక్తసామరస్యానుభూతివరకును భక్తియొక్క పరమావధి.

౧౫. సర్వపరిపూర్ణాఖండసమరసాత్మునిగూర్చి భక్తి సలుపుటలో జాతి, మత, వర్ణ, లింగ, వయో, రూప, విద్యా, క్రియా, ధనాదివిభేదములతోఁ బనిలేదు.

౧౬. అర్భకావస్థయందుండునెల్లరకును మాతృస్తన్యమును గ్రోలుట కెంతస్వతంత్రత గలదో, యెట్టిభేదమును లేక క్షుత్పిపాసలుగలయెల్లరకును నన్నపానీయాదులు గైకొనుట కెట్లర్హత గలదో యట్లే, యాయద్వితీయపరంధాముని జ్ఞానానందాదిశక్తిమత్త్వాదిసర్వవిభూతుల కేకాశ్రయునిగను, సర్వాశ్రయునిగను, సర్వనియంతగను, నేతత్సర్వాశ్రయువిస్మరణము జెంది తదాశ్రయాభావముగా సలుపుభావక్రియాదులే తాపత్రయాత్మికసంసృతిబంధకారణముగను, నేతద్బంధవిముక్తికా సర్వాత్మునియాశ్రయమే పరమాశ్రయముగను పూర్ణముగ గ్రహించి, యనవరతాఖండభావముతో నాయఖిలాత్మునిదివ్యానుగ్రహము బడయునాకాంక్షతోఁ దీవ్రపిపాస జెందునెల్లరకును భేదరహితముగ భక్తిసల్పుటకు సంపూర్ణార్హత గలదు.

౧౭. పరాత్పరునియనుగ్రహాకాంక్షతో భక్తిసలుపుటలో నుపాస్యోపాసకబాంధవ్యము భిన్నాకారములు దాల్చును.

౧౮. గృహమేధికిని, తదనుచరులకును జనించువివిధ బాంధవ్యములవలె, ప్రాక్కర్మజనితస్వగతసంస్కారభావోద్రిక్త భక్తితారతమ్యముననుసరించి, యాసర్వాధారునియందు వివిధ భక్తులకు వివిధములగు పితృ, మాతృ, భ్రాతృ, భర్తృ, గురు, మిత్ర, ప్రభుస్వరూపబాంధవ్యములు ప్రబలుచుండును.

౧౯. మరల నా బాంధవ్యములందును, నా సర్వ బాంధవుని గూర్చిన తత్త్వగ్రహణము భేదరూపములు దాల్చును.

౨౦. సాధకులయొక్క సహజస్వభావమును బట్టియు, భక్తి తారతమ్యమును బట్టియు, నొకనికి ప్రేమస్వరూపుని వలెను, నొకనికి ధర్మస్వరూపుని వలెను, నొకనికి సత్స్వరూపుని వలెను, మరొకనికి సర్వజ్ఞుని వలెను, నొకని కానందరాశి వలెను, నింకొకనికి మహాశక్తిగను, వేరొకనికి సర్వగుణాశ్రయుని వలెను, మరొకనికి నిర్గుణశాంతాకారుని వలెను, నొకనికి సర్వకర్తగను, మరొకనికి నిస్సంగనిష్క్రియాకారుని వలెను, నిట్లు భిన్నరీతుల తత్త్వము విదితమగుచుండును.

౨౧. ఆకారణముచే నా యా భక్తు లా యా లక్షణయుక్తముగ నా యా యుపాస్యోపాసక బాంధవ్యములతో నా పూర్ణవిగ్రహుని పరమభక్తితో భజింతురు.

౨౨. మఱల నీభక్తి సహేతుకమనియు, నహేతుకమనియు ద్వివిధము.

౨౩. ఆర్తుడు, అర్థార్థి, జిజ్ఞాసువు, జ్ఞాని యని చెప్పఁబడు చతుర్విధభక్తులలో నార్తార్థార్థులిర్వురును, సహేతుకభక్తులు; జిజ్ఞాసు, జ్ఞానులిర్వురును నహేతుకభక్తులు.

౨౪. పుత్ర, మిత్ర, కళత్ర, ధన, ప్రాణ, మానాది నష్ట, కష్టములు సంభవించుతఱి, గత్యంతరముఁ గానక యానష్టకష్టనివారణార్థమై సల్పుభక్తికి నార్తభక్తియని పేరు.

౨౪. పుత్ర, మిత్ర, కళత్ర, ధన, కనక, వస్తు, వాహనాదులయొక్కయు, విద్యా, యశో, బల, దర్పాదుల యొక్కయు నభివృద్ధిని వాంఛించుచు, నయ్యది స్వశక్తిసాధ్యము గాకుండుటచే, సర్వవిభునిగూర్చి సల్పుభక్తి యర్థభక్తి యనఁబడును.

౨౫. క్షీరము లగ్నికారణమున వర్ధమాన మగురీతి, స్వవశము మీఱుటచే, కామ్యావిష్టచేతస్కులై, తాత్కాలమునకు తాత్ప్రయోజనార్థమై సలుపఁబడుభక్తి గావున, నీ రెండువిధములైనదియు సహేతుకభక్తి యనఁబడును.

౨౬. ప్రేమ సహజముగ మాతృస్థానగమనరూపక మగుటచే, కొందఱు సుకృతాత్ములం దీప్రేమ, స్వానుభవ జనితనిర్మలబుద్ధితీక్ష్ణతచే, నీదృశ్యాదృశ్య, విచిత్ర, భిన్న నామరూపాత్మకప్రపంచముయొక్కసృష్టి, స్థితి, లయాను క్రమణమును, తత్కారణమును, తదధిష్ఠానచైతన్యసత్తా స్వరూపమును గూర్చినసమ్యక్పరిశీలన, సమ్యగ్దర్శనములను జనింపఁజేసి, మహదనంత, సర్వాశ్రయ, సచ్చిదానందపర బ్రహ్మమం దహేతుకగాఢానురాగమును దాల్చి వర్తించును. ఇట్టిభక్తికి జిజ్ఞాసభక్తి యనిపేరు.

౨౭. ప్రాజ్ఞుఁడు తరంగఫేనబుద్బుదాదులందు జలమును, ఘటశరావాదులందు మృత్తును, పటాదులందు తంతు

వులను, నప్రయత్నముగ, సహజముగనే గ్రహించునట్లు, బహుజన్మలభ్యమగుతపస్సిద్ధిచే నహేతుకముగను, నప్రయత్నముగను, దృశ్యాదృశ్య, మూర్తామూర్తాదిసమస్తమందును సర్వమయ సమరసైకాద్వితీయాఖండసర్వాత్మ బ్రహ్మమునే దర్శించుచు, సదా తదైక్యానుభవానందపారవశ్యాతిరేకావిభక్తిస్థితియందు దోలలాడు కొందఱు మహాత్ములు గలరు. ఇట్టిభక్తికి జ్ఞానభక్తి యనియు, పరాభక్తి యనియుం జెల్లు.

౨౯. జిజ్ఞాస, జ్ఞానములను రెండును, నిష్కామ్యములై, సహజములై, యహేతుకములగుటచే నహేతుకభక్తి భేదము లనఁబడును.

30. సహేతుకభక్తి క్రమదృఢప్రయాసచే నహేతుకత్వమును జెందినఁగాని కర్మబంధనిర్ముక్తికిని, పరబ్రహ్మావిభక్తపరమపదప్రాప్తికిని సాధనము కాఁజాలదు. అహేతుకభక్తి, సహజమును, నిష్కామ్యమును, నిష్కల్మషమును, నిశ్చలమును, నిరంతరాయమును, కేవలసన్నిహితమును నగుటచే నట్టిభక్తుఁడు సర్వసమరసాఖండదివ్యాత్మునియందు సాక్షాత్సామరస్యమును బడసి, యవిభక్తకైవల్యపదమానందభిషిక్తుఁడై రాజిల్లును.

ఓం తత్ సత్ !





నమో భగవతే జ్ఞానానందాయ !

# విజ్ఞానభక్తితరఙ్గిణి

## ద్వితీయతరఙ్గము

౧. ఫలదాయకమైన సిద్ధక్షేత్రమందు నాటినబీజము లమోఘఫలదాయకము లగునట్లు, విశుద్ధచిత్తమందునాటిన భక్తిబీజము లనంతఫలరూపము దాల్చి యనంతాత్ముని జేర్చును.

౨. విశుద్ధదర్పణమందు వస్తుబింబములు చక్కగాగోచరించు తెఱంగున, సాధకునిశుద్ధచిత్తమం దెటుపరికించినను, జగమంతయు విచిత్రాద్భుతశక్తిసంపదుపేతమై, చిత్తాకర్షకమై, యున్నటుల స్ఫురించుచుండును.

3. మహత్తరమై, మహోదారమై, మహాద్భుతదగ్భ్రమకరమై, హృదయానందదాయకమై, బుద్ధీంద్రియాతీత కారణజాతమైన పదార్థజాలము నవలోకించినపుడెల్ల నిట్టి

స్ఫురణ ప్రవృద్ధిజెంది, యేతదనంతవిభూత్యాశ్రయుఁ డగునొక సర్వాంతర్వర్తి గలఁ డనుదృఢవిశ్వాసము జనించి, యామహా మహుని సర్వకారుణ్యాత్వ, సర్వవిభవత్వ, సర్వజ్ఞత్వ, సర్వశక్తిమత్త్వాదిగుణములఁ గీర్తించి, ప్రస్తుతించి, శ్రద్ధా, భక్తిసంయుతాంతఃకరణుఁ డగును.

౪. ఇదియే భక్తిభావోదయమునకు ప్రథమకారణము.

౫. ప్రేమయొక్క యుత్తమాశయపరివర్తన మిదియే.

౬. ఇట్టినిర్మలభక్తికి కామ్యభావముగాని, ఫలాపేక్షగాని యుండఁబోదు.

౭. నదీనదరూపముదాల్చినజలము జలధినిజేరుటయే పరమగమ్యముగనెంచి ప్రవహించినను, యథార్థమార్గమును గనజాలక యిటు, నటు, వక్రగమనము సల్పునటుల, భక్తిసంజనితాంతఃకరణుఁ డగువాని ప్రేమ, పరంబ్రహ్మదర్శన, స్పర్శన, సంగమైక్యతాకాంక్షారూపమును దాల్చినను, బహుజన్మాశ్రితాజ్ఞానవాసనామూలమున, నది స్థైర్యమును జెందక, యథార్థమార్గ మెఱుఁగరాక, పలువిధము లగువక్రమార్గములందు, సుడులందువలె దిరుగాడుచుండును. ఆకారణమున నాధకుఁడు, నావికుఁడు లేనినావచందమునఁ దిరుగుచు పరమావధిని బొందఁజాలకుండును.

౮. సుక్షేత్రమందు, యుక్తబీజములు నాటి పోషించుటకు చతురతగలకర్షకుఁ డావశ్యకమగునట్లు, విశుద్ధచిత్తమందధికారతారతమ్యము నెఱిఁగి యుక్త మగుభక్తిబీజమును నాటి, యది ఫలరూపము దాల్చువరకును, సమ్యగ్రక్షణ సేయు, మహాపురుషుండును, ననంతాద్వితీయసచ్చిదానందబ్రహ్మానుభవశీలుండును, నిష్కాముండును, వీతరాగుండును, నుదారుండును, సమరసమృదుమధురస్వభావుండును, నిస్సంగుండును, కరుణాసింధుండును నగుసద్గురుశ్రేష్ఠుని యాశ్రయమత్యంతావశ్యకము.

౯. ఏవిద్యయు, నేకృషియు, నుపదేష్టలేక ఫలరూపము నొందఁజాలదు.

౧౦. నావికుఁడులేని నావచందమునను, సహాయకుఁడులేనియంధునిచందంబునను, అంధకారమునజ్యోతిరహితయాత్రికునిచందంబునను, సారాऽసారసమ్యగ్దర్శననిష్ఠాచతురుఁ డగుసద్గురుసముపాశ్రయములేనిచో, భక్తిభావోదయుఁ డగువిశుద్ధచిత్తుఁడైనను పరమావధినిజేరుట కష్టసాధ్యము.

౧౧. కావున సర్వయత్నములచేతను సాధకుఁడు బ్రహ్మవిదుత్తముఁ డగుమహాపురుషుని యాశ్రయానుగ్రహములను బడయవలెను.

౧౨. అట్టిసద్గురువును, తనపూర్వపుణ్యాతిరేకమున నిర్హేతుకకరుణాకటాక్షముచేఁ దన్నుఁ దరింపజేయ, సాకారమున నవతరించిన యనంతపరిపూర్ణబ్రహ్మమే యనివిశ్వసించి, శ్రద్ధాభక్తులతోఁ దత్ప్రసన్నతఁ బడయునట్లు మెలంగవలెను.

౧౩. సద్గురుపుంగవునందుగల యట్టిశ్రద్ధాభక్తులచే, వారియాజ్ఞయే తనకు శ్రేయోధర్మమనియు, వారిదర్శన, స్పర్శన, వందన, సేవార్చనలే తనయాత్మానందమనియు, వారిప్రసన్నతయే తనకైవల్యప్రాప్తిసోపానమనియు సాధకునకు దృఢప్రపత్తి జనించును. ఆగాఢప్రపత్తిచే, త్రికరణములను, తన సర్వస్వమును సద్గురుపరబ్రహ్మార్పణము చేయును.

౧౪. సాధకుఁడు తనసర్వస్వమును సద్గురునకు నివేదించుటచే, వస్తుసంఘాతములందును, త్రికరణములందును గల స్వాభిమానము నశింపఁజేయుచు, కేవలసద్గురునాజ్ఞానువర్తియై మెలఁగును.

౧౫. సద్గురువు, సమరసనిత్యాద్వయాఖండబ్రహ్మానుభవస్వరూపుఁడు గాన, తదాజ్ఞాభాషణోపదేశవర్తనాదులన్నియు సాధకునకు బ్రహ్మకైవల్యమార్గసోపానములుగనే యుండును.

౧౬. కావున నిట్టిసద్గురుననుగ్రహపాత్ర మగుజీవితాచరణచే ననంతాత్మనియవిభక్తానుగ్రహము కరతలామలకమగును.

౧౭. అయస్కాంతసన్నికర్షణముచే నినుమునకుఁగూడ చుంబకశక్తి ఘటించునట్లుల, సద్గురుని యాశ్రయ, సాన్నిధ్య, ప్రసన్నతలచే, భక్తిభావోదయుఁ డగువిశుద్ధచిత్తునకు, సత్యాఽసత్య, సారాఽసారవిచారణమొదలు పరబ్రహ్మాఽవిభక్త్యానుభవప్రాప్తివరకును గలభక్తిపథమంతయు స్వానుభవమునకు వచ్చును.

౧౮. భక్తిభావోదయము, సద్గురుసముపాశ్రయము, సద్గురుప్రసన్నత, సత్యాఽసత్యవివేకము, తీవ్రమోక్షేచ్ఛ, అసదింద్రియవస్తువిషయవైరాగ్యము, సత్త్వసంపత్తి, బ్రహ్మధ్యానము, బ్రహ్మాఽవిభక్తపదప్రాప్తి యనునీతొమ్మిదియు భక్తిపథమందలి క్రమసోపానములు.

౧౯. క్రమసోపానములైనను, నన్యోన్యాశ్రయము లగుటచే, నవినాభావముగ నవలంబనీయములై యున్నవి.

౨౦. విశుద్ధచిత్తమందలిసత్త్వాభివృద్ధిచే భక్తిభావోదయమను ప్రథమసోపానప్రాప్తి 'నొందినసాధకుఁడు, సద్గురుసముపాశ్రయమను ద్వితీయసోపానము నాశ్రయించును.

౨౧. తత్కృతభక్తిపూర్వకసేవాతిరేకమున, సద్గురుశ్రేష్ఠుఁ డత్యంతసంతృప్తిని జెంది, యనుగ్రహ, వాత్సల్యదృష్టితో పరమపదప్రాప్తికి హేతుభూత మగుభక్తిపథము

నంతయు విశదీకరించి, యనుష్ఠింపఁజేయును. ఇదియే సద్గురు
ప్రసన్నత యనుతృతీయసోపానము.

౨౨. దృశ్యమాన మగునీమనోదేహేంద్రియవిషయగా
త్మకపుత్ర, మిత్ర, కళత్ర, బాంధవ, పశు, భృత్య, ధన,
కనక, వస్తు, వాహన, మహీ, మండలాదిసర్వప్రపంచము
నాద్యంతములుగలదై, యనుక్షణషడ్భావవికారదూషితనామ
రూపాత్మకమై, షడూర్మిత్రివిధతాపాదిబాధితమై, యస్వతం
త్రమై, నిజసత్తాశూన్యతచే త్రైగుణ్యమానసికత్రివిధభేదా
వస్థలచే భ్రామ్యమాణమై, యస్తి, భాతి, ప్రియాభావ
మగుటచే నసృత, జడ,దుఃఖాత్మకమై, యజ్ఞానసంజనితమోహా
స్పదకర్మపాశసంసృతిబంధకారణమై దనరుచున్నది.

౨౩. తరంగదృశ్యమందు, తరంగాదులు కార్యమును,
ద్రవస్వభావము కారణమును, జల మధిష్ఠానమును నై యున్న
ట్లెల్లెడలఁ గారణములేనికార్యమును, యధిష్ఠానసత్తాలేనికార
ణము నుండఁబోదు.

౨౪. కావున కార్యరూప మగునీభ్రామ్యమాణనామ
రూపాత్మకప్రపంచమునకుఁగూడ నొకకారణమును, పరిణామ
రహిత, సర్వాధార మగునొకయధిష్ఠానమును నుండితీరవలెను.

౨౫. క్షణభంగుర, పరిణామరూపాఽసంఖ్య, భిన్నతరం
గఫేనబుద్బుదాదులయుత్పత్తిస్థితిలయాదులకు సర్వాధారమై,

యాతరంగాదు లుద్భవస్థితిలయాదుల నొందుచున్నను, వాని సాహచర్యమున పరిణామవినాశములను జెందక, వానియుద్భవ స్థితిలయాదులందును, పూర్వాపరములందును నబాధితమై, సర్వ మయమై. యేకరూపమున నేకరీతిని తదధిష్ఠానమై వర్తించు జలమురీతి, నీపరిదృశ్యమాన, భ్రామ్యమాణ, నామరూ పాత్మికవస్తుప్రపంచముయొక్క యుద్భవస్థితిలయసూత్రికాశ్ర యమై, సర్వాధారమై, తత్పరిణామమం దపరిణామమై, జగ దుద్భవస్థితిలయాదులందును, తత్పూర్వాపరములందును నబాధి తమై, యేకరూపమై, యభేదమై, నామరూపరహితమై, దేశ కాలవిలక్షణమై, సర్వానుస్యూతమై, సర్వసారమై, సర్వాత్మి కమై, సర్వమునై, సర్వపరిపూర్ణమై, సర్వశక్తియై, స్వప్రకా శమై, సర్వప్రకాశకమై, యస్తి, భాతి, ప్రియాత్మికపరబ్ర హ్మము సర్వాధిష్ఠానమై వెలుఁగొందుచుండును.

౨౬. ఈయఖండ, సర్వపరిపూర్ణబ్రహ్మమే సత్యమును, నిత్యమును, అమృతమును, సచ్చిదానందదాయకమును నగు యథార్థవస్తువు.

౨౭. ఏతద్బ్రహ్మభావమే సిద్ధాంతమన్నచో సర్వా భావ, సర్వబాధిత ప్రతిపాదన మగునుగావునను, బ్రహ్మాస్తిత్వ ముచే సర్వాస్తిత్వప్రతిష్ఠయగునుగావునను, సచ్చిదానందదివ్య పరబ్రహ్మమే యఖండపరమాస్తిత్వమని సిద్ధాంతము చేయఁ బడుచున్నది.

౨౮. ఈసర్వపరిపూర్ణసచ్చిదానందబ్రహ్మమునే భగవానుఁడనియు, సర్వేశుఁడనియు, విష్ణువనియు, పరమశివుఁడనియు, రామయనియు, కృష్ణయనియు, పరశక్తియనియు, పరంజ్యోతియనియు, నయ్యది 'తత్' పదవాచ్యమనియు, 'సత్' పదవాచ్యమనియు, 'నేతి' పదబోధ్యమనియు, 'చిత్' పదవాచ్యమనియు, 'ఆనంద' పదవాచ్యమనియు, తత్త్వదర్శులు భిన్నరీతుల నిర్వచింతురు.

౨౯. సర్వవిభూత్యాత్మక బ్రహ్మమునకు భిన్నమగు వస్తువెద్దియు లేకున్నను, జలగతమగు ద్రవత్వమువలె, బ్రహ్మాంతర్గతానిర్వచనీయావ్యక్తాభిన్నమాయాశక్తిచే, బ్రహ్మవ్యతిరిక్తముగ, దృశ్యమానమగునీభిన్ననామరూపాత్మికసృష్టి యంతయు, బ్రహ్మాభిన్నముగ కల్పితమై, యాభాసనాట్యము ప్రతిభాసించుచున్నది.

౩౦. అనిర్వచనీయమాయాశక్తి, యథార్థసత్తారహితాసద్రూపమైయున్నను, సర్వచైతన్యబ్రహ్మాశ్రయముచే, చేతనాత్మికముగ ప్రతిభాసఁజెందుచుఁ బ్రపంచపరిణామకారణమై వర్తిలుచున్నది.

౩౧. ఈయసద్రూపపరిణామాత్మికమాయాశక్తినే,యీశ్వరశక్తియనియు, లీలాశక్తియనియు, నీశ్వరేచ్ఛయనియు, మూలప్రకృతియనియు, నవ్యక్తమనియు, భిన్నరీతులఁ బేర్కొందురు.

౩౨. కార్యము కారణముకంటె భిన్నముకాజాలదు.

౩౩. కారణము, కొన్ని బాహ్యపరివర్తననిబంధనలమూలమున నన్యముగ గోచరించుకార్యరూపము దాల్చినను, తద్గత నిజసత్తా కొకింతయు వినాశముండదు.

౩౪. అనగా కార్యముగూడ కారణాత్మికసత్తాగలది గనే యుండును.

౩౫. స్వర్ణము కారణముగాఁ గలిగిన యాభరణాదులు కల్పితబాహ్యపరివర్తనలచే భిన్నాకారములుగ గోచరించినను, యథార్థమందవి స్వర్ణభిన్నముగాక స్వర్ణమయములే యగునట్లు, బ్రహ్మము కారణముగాఁ గలమాయాశక్తియు వాస్తవమందు బ్రహ్మవ్యతిరిక్తముగాక బ్రహ్మాత్మికమే యైయున్నది.

౩౬. మరియు, సర్వాధిష్ఠానబ్రహ్మము వివర్తకారణముగా, బ్రహ్మాత్మికమాయాశక్తి పరిణామకారణముగాఁ గల యీ దృశ్యమాననామరూపాత్మిక విశ్వముగూడ యథార్థమందు బ్రహ్మభిన్నముగాక బ్రహ్మాత్మికమే యైయుండవలెను.

౩౭. అనగా బ్రహ్మము సర్వాధిష్ఠానముగఁ గలిగి స్ఫురించుసర్వమును వాస్తవమందు బ్రహ్మాత్మికమే యైయున్నది.

౩౮. కాని, పరిణామయుతభిన్ననామరూపపరిదృశ్యమానమే బ్రహ్మస్వరూపముగాదు.

౩౯. ప్రతిపదార్థమునందు గల, ‘నామ + రూప + అస్తి + భాతి + ప్రియ’ము లనెడుపంచలక్షణములందు,

యసన్మాయాపరిణామ మగునామరూపములు రెండును దృశ్యమాన పరిణామము నొందుచు, యసత్తేయగుచుండ, అస్తి, భాతి, ప్రియాత్మక మగునవినాశ్యాఽపరిణామభేదరహితాఖండబ్రహ్మమంతటను నేకాకారమున ప్రకాశించును.

౪౦. మాయాత్మిక మగుమహదాదిపంచభూతసృష్టియంతయు, కేవలదృశ్యమానమును, భ్రమాత్మకమును, నసద్రూపమును, ననిత్యమును నగుటచే యథార్థమం దదిలేనిదే యగుచున్నది—'యా మా సా మాయా'.

౪౧. కావున నామరూపాత్మకభేదదృశ్య మంతయు నగ్రాహ్యమును, ననపేక్షణీయమును నై యున్నది.

౪౨. అంతటను, నపరిణామమై, యవినాశ్యమై, సర్వాత్మకమై, సర్వమునై ప్రకాశించునది యఖండాద్వయబ్రహ్మమే గాన, బ్రహ్మమే సత్యమును, నిత్యమును, సర్వసారమును, గ్రాహ్యమును నగుయథార్థవస్తువు.

౪౩. శుక్తిరజితభ్రాంతిఁజెందినయతఁడాప్తోక్తిచే భ్రమఁదొలఁగి, శుక్తిరజితముల యథార్థస్వరూపగ్రహణమును బడయునట్లు, భక్తిభావోదయుఁడగువిశుద్ధచిత్తునకు సద్గురూపదిష్టదివ్యబోధచేతను, శ్రుతిప్రామాణ్యముచేతను, తజ్జనితసువిచారణచేతను, ననాద్యవిద్యావాసనాజనితభ్రమదొలఁగి, పరిదృశ్యమానవిశ్వముయొక్కయసత్స్వరూపమును, నింద్రియాతీత, నిరుపాధికశుద్ధబ్రహ్మముయొక్కసర్వాత్మకసత్స్వరూపమును నెఱుకపడును.

౨౨. ఇదియే భక్తిపథమందలి సత్యాఽసత్య, సారా
ఽసారవిచారణ యనుచతుర్థసోపానము.

౨౩. సత్యాఽసత్యవిచారణసిద్ధిచే, పరబ్రహ్మాభిన్న
మగు గ్రాహ్యవస్తు వెద్దియును లేమింజేసి, తనపరమావధియు, తన
యథార్థాఽస్తిత్వమును, అఖండాద్వితీయసచ్చిదానందబ్రహ్మై
క్యావిభక్తస్వరూపమే యనియు, బ్రహ్మాభిన్నముగఁ దోచు
నామరూపాత్మక మనోదేహేంద్రియాదులందును, పుత్ర,
మిత్ర, కళత్ర, ధన, కనక, వస్తువాహనాదులయెడను తానన
డియు, తనననెడియు, మిథ్యాసత్యత్వప్రేమబుద్ధియును, తత్ప్రేమ
జనితకర్మపరంపరలును, పరమశ్రేయోదాయకపరమపదమును
జెందనీక యంతరాయములై, సంసృతిబంధకారణములై తనరె
ననియు, సాధకునకు గాఢప్రబోధజనించుటచేఁ దత్సంసృతిబం
ధమునుండియచిరముననే విముక్తుఁడై బ్రహ్మాత్మైకత్వప్రాప్తిని
బడయవలె నను నెడతెగని దృఢ, తీవ్రేచ్ఛ జనించును. ఇదియే
భక్తిపథమందలి మోక్షేచ్ఛయను పంచమసోపానము.

౨౪. సాధకుఁడు, తీవ్రమోక్షేచ్ఛచే సచ్చిదానంద
బ్రహ్మవ్యతిరిక్తముగఁ దోచు వినశ్వరాఽశాశ్వతానృతజడ
దుఃఖాత్మక మగు నిహాముష్మికవిషయార్థఫలభోగములందు విము
ఖతఁజెంది, తత్తద్విషయార్థములను, తద్గతభోగాసక్తతను నిగ్ర
హించి, నశింపఁజేయుచుండును. దీనిని బాహ్యవిరాగమందురు.

౪౭. స్వదేహముగాని, యింద్రియమనంబులు గాని, సత్యములును, నిర్వికారములును, నిత్యములునుగాక యసత్పరిణామాంతముగలవియే యగుటచే, వానియెడ, నహంమమేత్యాద్యభిమానముతోడను, కర్తృత్వ, భోక్తృత్వాది సంగముతోడను గూడినయహంవృత్తిని నిగ్రహించి నిస్సంగనిరభిమానముగ నుండుట యాంతరంగికవిరాగ మనఁబడును.

౪౮. ఇట్టి బాహ్యాంతరంగిక ద్వివిధరూప విరాగము భక్తిపథమందలి షష్ఠసోపానము.

౪౯. ఆరోగ్యసిద్ధిని బడయుటలో నౌషధమునకు సహకారము లగునను పాన, పథ్యాదులవలె, నద్వితీయాఖండశుద్ధపరిపూర్ణబ్రహ్మాఽవిభక్తపరమపదప్రాప్తి యనుపరమనిఃశ్రేయసత్వసిద్ధిని బడయుటలో నత్యంతసహకారమగుసత్త్వసంపదభ్యాస మత్యావశ్యకమైయున్నది.

౫౦. ౧. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య, దంభ, దర్పాభిమానాదివృత్తులను మనంబున, బొడమనీక నిగ్రహించుటయును నంతరింద్రియనిగ్రహమును, ౨. పంచకర్మేంద్రియపంచజ్ఞానేంద్రియములను, వానిపరస్పరవిషయార్థభోగములందుఁ బోనీక నిగ్రహించుట యను బాహ్యేంద్రియనిగ్రహమును, ౩. శీతోష్ణ, క్షుత్పిపాస, సుఖదుఃఖ, మానావమానాదిద్వంద్వములచేఁ జలింపక సహిష్ణుతఁ జెంది యుండుటయును, ౪. ఇంద్రియమనంబులను బాహ్య

విషయస్పృహ లేక నిశ్చలతావస్థయందుంచుటయును, ౫. సద్గురు వాక్యములయు, శాస్త్రవాక్యములయు, సిద్ధాంతములందు పూర్ణవిశ్వాసభావముంచుటయును, ౬. తన్నిశ్చితసిద్ధాంతము నుండి చలింపనీక, తత్సిద్ధాంతభావమునందే మనంబును స్థిరము చేయుటయును, ౭. సాధుసాంగత్యసేవలును, ౮. భక్తి, జ్ఞాన, వైరాగ్యప్రతిపాదకము లగుఋషిప్రణీత ఋషినిర్దిష్టసద్గ్రంథ ములను, మహాపురుషచరిత్రాత్మకగ్రంథరాజములను, సువిచా రణదృష్టితోఁ బఠించి, తత్సారగ్రహణఁజేసి వర్తించుటయును, ౯. అనంతవిభూత్యాశ్రయ శుద్ధబ్రహ్మమునెడ నెడతెగని ప్రేమయు, ౧౦. భగవత్కథాభివర్ణన, కీర్తన, భజన, శ్రవ ణాదులందు రతిగలిగి వర్తించుటయును, ౧౧. ఈశ్వరావతార మూర్తులపూజయును, ౧౨. బ్రహ్మార్పితాఖిలకర్మాచరణమును, ౧౩. చేతనాచేతనములందు బ్రహ్మాత్మికవిభూతి, సత్తాలను దర్శించి, ప్రశంసించి, యుప్పొంగి యానందించుటయు, ౧౪. విజనస్థలనివాసమును, ౧౫. మౌనవృత్తియు, ౧౬. ఉత్తమాశయ భావపోషణంబును, ౧౭. ధైర్యమును, ౧౮. ఉత్సాహమును, ౧౯. ఋజువృత్తియు, ౨౦. నిత్యతృప్తియు, ౨౧. శాంతియు, ౨౨. క్షాంతియు, ౨౩. అమానిత్వమును, ౨౪. ప్రాపంచికవిషయ భోగపరాయణులయొక్కయు, దుర్జనులయొక్కయు సంగవిము ఖతయు, ౨౫. ఇంద్రియవిషయభోగాత్మికవ్యర్థకథావర్ణన, శ్రవణ, హాస, లీలాదివర్జనంబును, ౨౬. ప్రాప్తాప్రాప్తముల యందుఖేదమోదములుజెందనియౌదాసీన్యమును, ౨౭. సమర సమ్మోదుమధురస్వభావమును, ౨౮. అహింసయు, ౨౯. సర్వ

భూతదయయు, ౩౦. స్వపరభేదరాహిత్యంబును, ౩౧. నిరపేక్షయు, ౩౨. ఔదార్యంబును, ౩౩. నిర్భీతియు, ౩౪. నిష్కాపట్యమును, ౩౫. సంతోషమును, ౩౬. దీక్షయు, ౩౭. నిరాడంబరత్వమును, ౩౮. స్వేచ్ఛయు, ౩౯. శౌచమును, ౪౦. నిద్రాలస్యజయమును, నను నలుబదిసాత్వికగుణంబులయభ్యాసము భక్తిపథమందలి సత్త్వసంపత్తి యనుసప్తమసోపానము.

౫౧. వైరాగ్య, సత్త్వసంపదలు లేనిభక్తి నిలువఁజాలదు.

౫౨. ఈరెండును లేనిసాధకుఁడు, వాయువుచే నీడ్వఁబడిన నావచందమున, విషయవ్రాతములచే నీడ్వఁబడి, తద్భ్రష్టుండై, పరమార్థవిదూరుఁ డగును.

౫౩. ఈరెండును ప్రతిష్ఠఁజెందినగాని, యష్టమసోపానమగుపరబ్రహ్మధ్యానమందు సాధకుఁడు సుస్థిరుఁడు గాఁజాలఁడు.

౫౪. కావున సర్వయత్నములచేతను, సద్గురుసమాశ్రయ, సత్యాఽసత్యవివేక బలముచే వైరాగ్యసత్త్వసంపదలందు ప్రతిష్ఠను బడయవలెను.

౫౫. పైఁజెప్పినసర్వోపాయములచేతను, భక్తుఁ డవిభక్తపదప్రాప్తి కనన్యసాధనమును, నత్యంతసన్నిహితమును నగుపరబ్రహ్మధ్యాన మనెడియష్టమసోపానము నధిరోహించి తత్సాధనపరిపక్వదశయందు భక్తియొక్క యంతిమపరమార్థస్వరూప మగుబ్రహ్మాఽవిభక్తపదప్రాప్తిని జెందును.

ఓం తత్ సత్ !





నమో భగవతే జ్ఞానానందాయ !

# విజ్ఞానభక్తితరఙ్గిణి



## తృతీయతరఙ్గము

౧. భక్తుఁడు, సద్గురుసముపాశ్రయబలముచే సత్యాసత్యవిచారణాదిసత్త్వసంపత్తిపర్యంతముగాఁ గలసర్వసాధనసంపన్నుఁడై, సద్గురూపదిష్టవిధమున ననంతపరిపూర్ణబ్రహ్మధ్యానాభ్యాసచిత్తుఁ డగును.

౨. భక్తునిచిత్తపరిపక్వదశానుగుణ మగుతారతమ్యమునుబట్టి సగుణధ్యానమో, నిర్గుణప్రతిపాదకలక్ష్యధ్యానమో, లేక, యవాఙ్మానసగోచరకేవలనిరుపాధికనిర్గుణబ్రహ్మానుసంధానమో సద్గురునిచే నుపదిష్టమగును.

3. సహజమానసికస్వభావానురాగమునుబట్టియు, నధికారతారతమ్యమునుబట్టియు, భక్తులీధ్యానాభ్యాసమందు, పర

బ్రహ్మవిభూత్యాత్మికము లగుబుషిదత్తమంత్రములందునో, సమంత్రకముగగాని, యమంత్రకముగగానిపరమేశ్వరవిభూతి శోభితావతారమూర్తులందునో, శ్రీసద్గురుమూర్తియందునో, వేదశాస్త్రచోదిత శివ, విష్ణు, శక్త్యాదిమూర్తులందునో, యీశ్వరవిభూతిశోభితహృదయ రంజకమహత్తరపదార్థమూర్తులందునో, బ్రహ్మతత్త్వప్రతిపాదకసత్, చిత్, ఆనంద, అనంత, పరిపూర్ణాదిదివ్యగుణములందునో, శబ్దబ్రహ్మమనంబడు ప్రణవమందునో, తన్నాదమందునో, సచ్చిదానందాత్మికపరంజ్యోతియందునో, యన్యలక్ష్యార్థములందునో, కేవలసాక్షిస్వరూపమందునో, యింద్రియాతీతనిరుపాధికావాఙ్మనసగోచరశుద్ధనిర్గుణబ్రహ్మమందునో లక్ష్యముంచి నిశ్చలభక్తితో ధ్యానింతురు.

౪. బహుజన్మార్జిత నామరూపదేహేంద్రియవాసనాపూరిత మగుచిత్తము, ప్రథమదశలందు నిరాకారనిర్గుణాత్మను భావింపలేమింజేసియు, నందుచిత్తస్థైర్యముజెందజాలనికారణమునను, నందలిరతి సిద్ధింపనికతమునను, భక్తునకు సగుణోపాసనయే సుసాధ్యముగను, సుస్థిరముగను, చిత్తోపరమముగను నుండును.

౫. భక్తుండభ్యాసబలముచే క్రమక్రమముగ నంతర్ముఖత్వమునొంది, ధ్యానమందలివృత్తిరహితసుసూక్ష్మావస్థలను జెందినకొలందియు, సాధకునిచిత్తము నామరూపాత్మికమాయా

పరిణామముల నతిక్రమించుచుండుటచే, యథార్థశుద్ధనిర్గుణ బ్రహ్మతత్త్వము క్రమముగ విదిత మగుచుండును.

౬. కావున నట్టియంతర్ముఖసూక్ష్మపరిణామముచే సాధకుఁడు క్రమకాలమున సగుణావస్థలను గడచి, నిర్గుణధ్యానమందుపస్థితుఁడగును.

౭. ప్రథమదశలందు, భగవన్మహిమాభివర్ణన, కీర్తన, భజన, నామ, స్మరణాదులచే చిత్త ముప్పొంగి, భక్తి స్థిరమై, భక్తుఁడు సదా బ్రహ్మధ్యానాసక్తచిత్తుఁ డగుచుండును.

౮. సంజనితస్థిరానురాగభక్తికారణమున, మకరందాస్వాదనాసక్తచిత్తమధుప మన్యరసానందము నెడఁ బ్రవర్తింపనియట్లు, భక్తునిమనంబన్యాకాంక్షలందుఁ జొరక సదాయఖండానందదివ్యవిగ్రహునియందే నిల్చును.

౯. ఇట్లన్యావలంబనావివర్జితుఁడై, సదా చిత్తము నేకాగ్రత నొందించి, సర్వవిభుని ధ్యానించుచు తదనుగ్రహదర్శనాకాంక్షియై మెలఁగును.

౧౦. ఇట్లు ధ్యానించుటలో భక్తి, బాహ్య మనియు, నాంతరంగిక మనియు, ననన్యమనియు త్రివిధక్రమపరిణామములఁ దాల్చును.

౧౧. ఇందు బాహ్యాంతరంగికములను ద్వివిధపరిణామములును భక్తియొక్కయష్టమసోపాన మగునీధ్యానస్థితికిని,

అనన్యమను కడపటిపరిణామరూపము భక్తియొక్క యంతిమ సోపానమును, పరమావధియు నగు బ్రహ్మకైవల్యమునకును జెందియుండును.

౧౨. ప్రథమమున నుపాస్యోపాసకబాంధవ్యము సాధారణముగ దాస, ప్రభురూపములనుబోలి యుండును.

౧౩. మహాప్రతాపశాలియు, సర్వవైభవోపేతుఁడును, మహోదారుఁడును, కృపాసింధువును నగుప్రభుని, సన్నుగ్రహవిశ్వాసపాత్రతలు గలసేవకుఁడు వినయ, భయ, భక్తులతో సేవించురీతి, నీబాంధవ్యభావమందు సర్వవిభూత్యాశ్రయ, సర్వపరిపూర్ణసచ్చిదానందపరబ్రహ్మమును భక్తుఁడత్యంతదాస్యభావముంచి యుపాసించుచుండును.

౧౪. ఈ దాస్యభావమందు దివ్యప్రభునామమే తన జన్మపావనకరముగను, ప్రభుసేవార్చనలే తనస్వధర్మముగను, తన్నిరంతరధ్యాన, సాన్నిధ్య, దర్శనములే తనజీవనామృతముగను నమ్మి దృఢభక్తిభావము నెలకొల్పి, సదాతన్నామస్మరణమునేగావించుచు, తాఁజేయుసర్వకర్మలును దివ్యప్రభుసేవార్చనలుగ నెంచి, తదర్పణబుద్ధితో, నిష్కామ్యముగ, కుశలతతో తత్ప్రసన్నతఁ బడయునట్లు గావించుచు, సదా యేకాగ్రచిత్తముతో సర్వమునందును సర్వమయదివ్యమూర్తినే ధ్యానించుచు కాలముఁ బుచ్చును.

౧౫. ఈ యవస్థయందు తానుపాసించుదివ్యమూర్తి, తనకంటెభిన్నుఁడుగను, భిన్నదేశీయుఁడుగను నుండి, తనకును దివ్యప్రభునకును హస్తిమశకాంతరవ్యత్యాసము భక్తునకు గోచరించుచుండును. అందుచే నిందలిభక్తి, భయసమ్మిళితమై యుండును.

౧౬. ఈభయ భిన్నతలతోఁగూడినధ్యానాభ్యాసమం దలిభక్తిపరిణతావస్థకే బాహ్యభక్తి యనిపేరు.

౧౭. ఈరూపమైన ధ్యానాభ్యాసము తీవ్రతనొందిన కొలఁది, భక్తి క్రమక్రమముగ వృద్ధియై, యుపాస్యోపాస కులమధ్య గలయనురాగబాంధవ్యము హెచ్చి, ప్రథమదశ లందు గలప్రభు, దాసభేదభావ మంతరించి సన్నిహితబాం ధవ్య మేర్పడును.

౧౮. ఈస్థితియందు భక్తుఁ డుపాస్యబ్రహ్మమును తనకంటె దూరస్థునివలెఁగాక, తనబాహ్యాభ్యంతరములం దేకా కారమున నంతర్వర్తియై రాజిల్లుచున్నటులను, తా నాపర మాత్మునందున్నటులును భావించి యాపరమాత్ముఁ డేకరీతిని బాహ్యాంతర్వర్తియై, తనశ్రేయోభిలాషియై, యవినాభావ ముగ . ప్రాణమిత్రునివలె సాహచర్యమునఁ దనతో వర్తిలు చున్నట్లు లనుభూతిని జెందును.

౧౯. ఈబాంధవ్యభావమందు దనప్రియమిత్రరూపుఁ డగుపరమాత్మ నొకించుకయు విడనాడక, యేకాగ్రచిత్త

ముతో, సదా యాదివ్యవిభునిసాహచర్యమున వర్తించుచున్నటు లానందించును.

౨౦. ఈ యన్యోన్యసాహచర్యకారణమున, నీయిర్వు రకును ప్రథమమునఁగలవ్యత్యాసభావము చాలవరకు సమసి పోవును.

౨౧. ఇట్లు ప్రియమిత్రభావముతో నాసర్వమయుని సాహచర్యమున వర్తించుచు, నిరంతరచిత్తైకాగ్రతాధ్యాన భావము పెంపొందినకొలఁది, యిర్వురకుగలప్రేమ యినుమడించి, భక్తుని నిజజన్మ, స్థితి, శ్రేయోభివృద్ధుల కఖిలాధారమగు నుపాస్యబ్రహ్మమందు సహజమాతృభక్తిభావమును ప్రభవింపఁజేయును.

౨౨. శిశుమాతృబాంధవ్యరూపముఁదాల్చిన నీయనురాగభక్తి యెడ తెగనిదియు, నహేతుకమును, సహజమును, నపారమును, ననివార్యమును, వర్ణనాతీతమునుగదా !

౨౩. ఆఁకొన్నవానికిఁదక్క తదన్యుల కన్నాసక్తియు, రుచియు తెలియనిచందమున, బిడ్డకుఁదక్క తదన్యులకు మాతృస్తన్య, మాతృప్రేమరసానందానుభవము గలుగనిరీతి, నాయనంతాఖిలాధారునియం దట్టిమాతృప్రేమ యనుభూతమైనవానికిఁదక్క తదన్యుల కీమాతృభక్తియొక్కయవర్ణ్య ప్రేమరసానందానుభవము గ్రాహ్యముగాదు.

౨౪. క్షుధయు, తచ్ఛాంతియు కేవలవిత్తభావాదిలభ్యములుగాక, సహజానుభవసిద్ధమగురీతి, నీభక్తిపరిణామరసానందానుభవముగూడ, కేవలధన, భావాదిలభ్యముగాక, సహజపారవశ్యానుభవసిద్ధమై యున్నది.

౨౫. ఈస్థితియందలిభక్తుఁడు మజ్జనాసన, భోజన, పాన, విలోకన, విసర్జన, విరామాదిసర్వవ్యాపారములందును, నన్యభావాశ్రితుఁడుగాక, నిరవధికసుఖదాయకమాతృప్రేమాకారితాఖండబ్రహ్మముచెంగటను, నొడియందును నున్నటుల, ననవరతధ్యానైకచిత్తానుభవానందపీయూష రసాస్వాదన మత్తతను జెందుచుండును.

౨౬. ఈయవస్థయందలిభక్తుఁడు తఱచుగ ప్రియవిభునిదర్శన, సాన్నిధ్యానుగ్రహభాగ్యమందోలలాడుచునే యుండును.

౨౭. ఒక్కొకతఱి, పరమమాతృప్రేమభావసంజనితానందాతిరేకముచే నానందసలిలబాష్పధారలుగార, పులకాంకితగాత్రుఁడై, యంతర్ముఖత్వమును జెందును.

౨౮. సర్వజీవనాధారమును, ప్రియతమమును నగు మాతృవియోగమును శిశు వొకించుకయుసహింపఁజాలనిరీతి, నీయవస్థయందలియనురాగ మెడతెగనిదగుటచే భక్తుఁ డర్ధనిమేషమైనను తనప్రాణప్రదునియెడబాటు భరింపఁజాలకుండును.

౨౯. ఆకారణముచే నొక్కొకసమయమున తనదివ్య విభునిదర్శనముగానక, తద్వియోగము నిర్భరమై, యుపేక్షితుం డైనవానిచందమున నిస్పృహుండై, చేష్టలుడిగి, యత్యంతము విలపించి తెలివిమాలి పడియుండును.

౩౦. ఒక్కొకతఱి, తద్దర్శనభాగ్యముచే హృదయ ముప్పొంగి, చెంగట తద్దివ్యమహిమావిభూతులఁ గీర్తించును.

౩౧. మఱొక్కతఱి, యాదివ్యవిభునిదర్శనానుభూతిం జేసి, సర్వమున్నాయఖండతేజునివైభవమే యని యానంద సాగరమగ్నుఁడగును.

౩౨. మఱొక్కసమయమున సర్వాశ్రయునియంక పీఠము లభించెనని కృతకృత్యభావముజెంది యుబ్బి నృత్యము సల్పును.

౩౩. వేఱొకసమయమున నేకాంతమున భక్తవత్సలుని తో ననురాగసమ్మిళిత మగుహాస్యలీలాసంభాషణాదులగావిం చుచు పరమానందమున నోలలాడును.

౩౪. అన్యసమయమున దయామయునికౌఁగిలిఁబడసి పూర్ణతృప్తుడై, సర్వమునుమఱచి నిష్క్రియత్వమును జెందును.

౩౫. పలుసమయములం దెడతెగని నిశ్చలధ్యానాతి రేకహృదయపారవశ్యముచే సర్వమును మఱచి తన్మయసమా ధుల నొందుచుండును.

౩౬. కావున నీస్థితియందలిభక్తుఁడుసర్వాంతర్యామియు, ననంతవిభూతిశోభితుఁడును, సర్వజగదుత్పత్తిస్థితిలయాధారుడును, భక్తవత్సలుడునునగుసచ్చిదానందదివ్యబ్రహ్మము తన యంతరంగమున నఖండవైభవముతో దేజరిల్లుచున్నటులును, తానాసర్వమయు, సర్వాకారుని యంతరంగమున నుద్భవస్థితుల నొంది వర్తించుచున్నటులును దృఢైకాగ్రధ్యానదృష్టితో దర్శించుచు, సుహృన్మాతృ బాంధవ్యగాఢానురాగజనితనిర్మల భక్తిపారవశ్యరసానందానుభవమునంజేసి, యన్యభావరహితుండై, బధిరాంధమూకోన్మత్తులపగిది నన్యులకు గ్రాహ్యంబుగాని భావచేష్టితములుగలిగి విహరించుచుండును.

౩౭. కావున నిట్టిస్థితియందు చరించుభక్తసత్తమునకు బాహ్యాభ్యంతరములందుపాస్యదివ్యమంగళప్రేమమయబ్రహ్మముదక్క తదన్యమెందును గానరాదు.

౩౮. ఇదియే ధ్యానసోపానమందలి యాంతరంగికభక్తి యనుద్వితీయపరిణామము.

౩౯. పైజెప్పినబాహ్యాంతరంగికము లనఁబడుభక్తి యొక్కద్వివిధపరిణామావస్థలందును, ననంతజన్మకర్మవాసనామూలమున నడుమ నడుమ, తనయౌన్నత్యమునకును, కృతకృత్యతకునునభిమానము పొడముచుండును. ఇదియే సాత్వికాహంకార మనఁబడును.

౪౦. 'అహంగ్రహ' భావమే జీవత్వజరామరణాదులకు హేతుభూతము గావునను, ప్రకాశాంధతలు రెండును విరుద్ధధర్మములైనటులంగున, 'బ్రహ్మోఽహ'మ్ములు రెండును గూడ విరుద్ధస్వరూపములగుటచే నేకకాలమున, నేకదేశీయముగనుండజాలవుగావునను, నేతత్కారణముచే 'అహం' వృత్తి భక్తికి ప్రబలవిరోధిగావునను, నది పొడసూపినపుడెల్ల భక్తుఁ డనంతవిభుస్వరూపునిఘనదివ్యరూపమందు, త'దహం' వృత్తి నర్పణముచేయుట యత్యావశ్యకమైయున్నది.

౪౧. ఇట్లహంవృత్తిని దివ్యవిభుసన్నిధి నర్పించుచుండుటచే, నాంతరంగికభక్తి, నిరంతరధ్యానాభ్యాసముచే క్రమక్రమముగ ప్రబలమై, యపారమై, యనవచ్ఛిన్నమై, హృదయము నావరించి నిరంతర, నిశ్చల, తన్మయసమాధులనొందించుటచే, సర్వమును బ్రహ్మాత్మికమై తేజరిల్ల, 'అహం' వృత్తికొకించుకయు తావులేక, స్థూలమునుండి సూక్ష్మ, సుసూక్ష్మపర్యంతముగల తనమాయాపరిణతావస్థలను క్రమముగ మీరి యసద్రూప మగుమాయయందు లీనమై యంతర్హిత మగును.

౪౨. 'అహం' వృత్తివిలయపూర్వకనిత్యనిరంతర తన్మయసమాధులంజేసి, తీవ్రతమావస్థను జెందినయిందలిభక్తి యనన్యరూపమునుదాల్చి భక్తునకును, దివ్యప్రభునకును గల భేదభావము నంతరింపఁ జేయును.

౪౩. ఆకారణముచే నీస్థితియందు భక్తుఁడు, సర్వేచ్ఛాసంకల్పవివర్జితుఁడై, సర్వావరణనిర్ముక్తుఁడై, యాద్యంతరాహిత్యమునుజెంది, పూర్ణుఁడై, యుపాస్యబ్రహ్మమునకును తనకునుగలభేదము నశించి, యభేదావస్థను గాంచును.

౪౪. అందుచే పరబ్రహ్మమే తానుగను, తానేపరబ్రహ్మముగను ననుభూతిని జెందును.

౪౫. ఈస్థితియందుపాస్యోపాసక, సాధ్యసాధకభావము నశించుటచే, భక్తి, భక్తుఁడు అనువిభేద మంతర్హితమై, భక్తి, కేవలబ్రహ్మైక్యావిభక్తపరమపదస్వరూపమును జెందును.

౪౬. పరబ్రహ్మాభిన్నపదరూపముదాల్చినభక్తిస్వరూపమునకే యున్నతపరిణామ మగుననన్యభక్తి యనిపేరు.

౪౭. బాహ్యాంతరంగికానన్యము లనఁబడు భక్తియొక్క త్రివిధక్రమపరిణామావస్థలనే, ద్వైతవిశిష్టాద్వైతాద్వైతభక్తి స్వరూపానుభవపదములని చెప్పనగును.

౪౮. సర్వాధిష్ఠాన, సర్వమయ, సర్వాత్మికాఖండాద్వితీయబ్రహ్మమునందలియవిభక్తపదసిద్ధియే భక్తియొక్క పరమావధియు, నుత్తమోత్తమాంతిమసోపానమునునై యున్నది.

౪౯. ఇట్టి బ్రహ్మావిభక్తపద మనంతమునునిరుపాధికమును నగుటచే నిందు షడ్భావవికారములుగాని, శీతోష్ణాది

ద్వంద్వములుగాని తాపత్రయాదులుగాని, పూర్ణమగుటచే నీషణత్రయజనితకర్మజాలములుగాని, యస్తి భాతి ప్రియాత్మకమగుటచే యనృతజడదుఃఖాత్మకజరామరణాదిమాయాబంధములుగాని పొడసూపవు.

౫౦. ఇట్టి సర్వపరిపూర్ణసర్వాశ్రయశుద్ధబుద్ధముక్తాఖండాద్వితీయనిరతిశయానంద పరబ్రహ్మైవిభక్తపదమే సర్వాస్తిత్వమై, సర్వమునకు సర్వమై, యఖిలజీవకోటికిని యథార్థసహజాత్మస్వరూపమైదనరుచుండుటచే, తదఖండపరమపదప్రాప్తియే జీవకోటికిపరమధర్మమును, పరమపురుషార్థమును, నిజశక్తి, జ్ఞాన, ప్రేమాత్మికజీవితధన్యోపాయమునై భాసిలుచున్నది.

ఓం శాంతి శ్శాంతి శ్శా.

ఓం తత్ సత్ బ్రహ్మార్పణమస్తు !



